# అరుణ కిరణాలు

జాతీయ గేయాలు

జంధ్యాల పాపయ్యశాస్త్రి
కరుణశ్రీ

కరుణశ్రీ కావ్యమాల
అమరావతి

# నమస్తే

కిరణాలు ప్రకృతికి అలంకరణాలు - ఆత్మజ్యోతికి ఆవిష్కరణాలు - విశ్వవిప్లవ విస్ఫురణాలు -

కిరణాలు నిద్రించేవారిని మేల్కొల్పుతై - మేల్కొన్నవారిని ముందుకు నడిపిస్తాయ్ - నడిచేవారికి చీకట్లో త్రోవ చూపిస్తాయ్ -

కిరణాలు స్తబ్ధమైన బ్రతుకుల్ని పులకింపచేసి పలికింపచేస్తాయ్ - క్రొత్త రక్తాన్ని ఒలికింపచేస్తాయ్ -

కిరణాలు రవిలోనుంచే కాకుండా కవిలోనుంచి కూడా ప్రసరిస్తాయ్ - రవికిరణాల్లో వలెనే కవికిరణాల్లో కూడా ఒక నవోదయం - ఒక యుగోదయం దాగి వుంటుంది.

వీటిలో చాలా భాగం ఢంకా చిత్రగుప్త రూపవాణి తెలుగుతల్లి ప్రజాశక్తి భారతి గృహలక్ష్మి ఆంధ్ర పత్రికల్లో ప్రకటితాలు. అందుకు ఆ పత్రికలకూ సంపాదకులకూ ధన్యవాదాలు -

నా కిరణాల్లో ఏ ఒక్కటైనా పాఠక హృదయాన్ని కదిలిస్తే కృతార్థుణ్ణి -

కరుణశ్రీ

# అనుక్రమణిక

# జయ్ హింద్

జయలక్ష్మిరా ! ! జయలక్ష్మిరా ! !
జయలక్ష్మిరా ! జగజ్జనని భారతమాత
జయపెట్టిరా ! నీదు జన్మభూమికి నేడు
జయలక్ష్మిరా ! !

మ్రోగింపరా ! ! మ్రోగింపరా ! !
మ్రోగింపరా ! దిశాంతముల నీజయభేరి
సాగింపరా ! ప్రజాస్వాతంత్ర్య రథము నిక
మ్రోగింపరా ! !

స్థాపింపరా ! ! స్థాపింపరా ! !
స్థాపింపరా ! నీ స్వరాజ్య విజయ ధ్వజము
ప్రాపింపరా ! నవ్యభారత ఘనోదయము
స్థాపింపరా ! !

# కరుణాంజలి

[బొంబాయి నావికుల బలిపీఠాలపై]

కదనోద్ధత కర్మవీర
వదనోద్గత రుధిరపూర
బలి పులికత నవభారత
జగతీ జాగరణాంజలి
తరుణ తరుణ బాష్పాంజలి

పరిమ్లాన దీన హీన
పరిక్షిప్త శప్త తప్త
పరాభూత జనతా దు
ర్భర జీవన మరణాంజలి
అరుణ అరుణ బాష్పాంజలి

సత్యాగ్రహ దీక్షాబల
సంస్తంభిత పరప్రభుత్వ
హత్యామయ దుష్కృత్య
ప్రత్యక్షీ కరణాంజలి
కరుణ కరుణ బాష్పాంజలి

# అరుణ

యువభారత యుగోదయంలో
నవభారత మహోదయంలో
పూచిందొక అరుణతరంగం
లేచిందొక క్రాంతి విహంగం

కంఠంలో విప్లవరాగం
గమనంలో విద్యుద్వేగం
దేశానికి నవసందేశం
లోకానికి నూత్నాలోకం

త్యాగోజ్జ్వల మహిమా మండిత
రాగారుణ రక్తపతాకం
నవభారత హృదయాంబరమున
ప్రసరించిన మహేంద్రచాపం

చైతన్యం జీవిత లక్ష్యం
స్వాతంత్ర్యం అంతస్సాక్ష్యం
ప్రాచీ దిగ్ దృగంచలంలో
రోచిస్సులు చిలికే కిరణం

అజ్ఞాతం అతిక్రమించిన
ప్రజ్ఞామయ విజయవిహారం
కురుక్షేత్ర సంగ్రామానికి
గురిపెట్టిన ఘన గాండీవం

•

# కెప్టెన్ లక్ష్మి

లాల్ ఖిల్లా ప్రాంతంలో
లక్ష్మి సాక్షాత్కారం
విమానాన్ని దిగుతున్నది
వీరఝాన్సి అవతారం

అరిభీకర కరవాలం
సుర పురిలో దాచిపెట్టి
దిగివచ్చావా క్రిందికి
దేవి ! ఝాన్సీబాయీ ! !

నేతాజీ కుడిభుజమై
స్వాతంత్ర్య క్షేత్రానికి
జాతిని నడిపిన దివ్య
జ్యోతివి కెప్టెన్ లక్ష్మి ! !

రక్తారుణ రణకవచం
రంగూన్‌లో ఉతుకవేసి
వచ్చావా ! మాతృచరణ
వందనార్థమై నేటికి !

# జయప్రకాష్

వెలువడింది వెలువడింది
విప్లవ సింహ కిశోరం

కుటిల జటిల శృంఖలాలు
పెటపెట ఫెటఫెటా త్రెంచి
కఠోర కారగారపు
కటకటాలలో నుంచి
వెలువడింది వెలువడింది
విప్లవ సింహ కిశోరం

పీడిత తాడిత జనగణ
ప్రేమమయ ప్రియ సుహృదయ !
ధనికవాద దావానల
శమన ఘనాఘనాభ్యుదయ !

జయ్ ! జయ్ ! జయ్ !
జయ్‌ప్రకాష్ !!
నవభారత యువ సమ్రాట్ !!!
జయ్ ! జయ్ ! జయ్ !

# ఆంధ్రకేసరి

ఆ కన్నుకొనలలో
ఆంధ్ర తేజోరేఖ మొలిచిందిలే!
ఆ కార్యదీక్షలో
అసమాన ధైర్యమ్ము నిలిచిందిలే!

ఆ సింహగర్జలో
అచల కర్తవ్యమ్ము మ్రోగిందిలే!
ఆ సాహసమ్ములో
ఆత్మగౌరవ గీతి తూగిందిలే!

వీరాంధ్రకేసరీ! విజయాంధ్రకేసరీ!
వేంచేయుమా రాష్ట్ర విజయవేదిక పైకి
ఆంధ్రప్రజా ప్రసుప్తాంతరంగముల కొక
అమర సంధేశమ్మువై!!
ఆశా ప్రకాశమ్మువై!!

# బాపూజీ

మా

నవాభ్యుదయ సంకేతం
నీ జన్మదినోత్సవ జయగీతం

హిమాలయ
మహా మహీధర
శిఖరాగ్రం మీదినుండి
స్వచ్ఛమైన అందం లాగున
స్వచ్ఛందచ్ఛందం లాగున
చెంగు చెంగుమని లంఘించే
చల్లని నదీమతల్లుల
ఉదాత్త జీవనానికి
ఉజ్జీవనం
బాపూజీ!
నీ జీవనం!

నీ నిత్యోజ్జ్వల వదనంలో
నీ సత్యాగ్రహ కదనంలో
బుద్ధదేవు కారుణ్యం వలె
శ్రద్ధామయ కర్తవ్యంవలె
ప్రవహించిన
ప్రతిధ్వనించిన
ప్రశాంత జయ ఘంటాధ్వానం
ప్రపంచ నవ యుగాహ్వానం !

పరాధీన-భారతదేశంలో
నిరాధార నిర్భాగ్యప్రజలకు
తరతరాల చైతన్యం
నరనరాల-కెక్కించే
భవ్యభవ తపశ్శక్తి
భారతీయ దాస్యవిముక్తి !

నీ అహింసా మకుట మణికాంతులు
ఈ మహాప్రపంచ సుఖశాంతులు !

నీఖాదీ
మా ఆజాదీ!

నీ ధ్యేయనిష్ఠ
జాతిస్వాతంత్ర్య పునఃప్రతిష్ఠ!

నీ సత్యాగ్రహ సాధన
శాంతిదేవతా సమారాధన!

నీ కర్తవ్య మహాదీక్ష
లోకానికి శ్రీరామరక్ష!

నీ సర్వమానవ సమాన దృష్టి
సత్యాహింసల సమిష్టి!

నీ బోసి నవ్వులు
దేశమాత పూజకోసం
కోసి రాసి పోసిన పువ్వులు!!!

# బాలవీరులు

స్వజాతి వీర శక్తులం
ప్రజా ప్రభుత్వ భక్తులం
అఖండ శౌర్య యుక్తులం
అజేయులం!! అజేయులం!!

స్వధర్మ కర్మవీరులం
స్వరాజ్య కర్ణధారులం
స్వదేశ చాటుకారులం
స్వతంత్రులం!! స్వతంత్రులం!!

అజేయ భారతీయులం
అమోఘ వజ్రకాయులం
అనంత గుణ విధేయులం
అఖండులం!! అఖండులం!!

మహాత్మగాంధి శిష్యులం
సుభాస్‌బోసు తమ్ములం
విశాల విశ్వభారతీ
విధాతలం!! విధాతలం!!

సువర్ణ వర్ణమాలతో
త్రివర్ణ కేతనాలతో
స్వతంత్ర సమర గాధలు
లిఖించుతాం!! లిఖించుతాం!!

జయధ్వజంబు సాగెరా
జయం! జయం! జయం! జయం!
ప్రభాతభేరి మ్రోగెరా
శుభం! శుభం! శుభం! శుభం!!

# కందుకూరి

అందుకోండోయ్! అందుకోండోయ్!
అందుకోండోయ్! కానుక లందుకోండోయ్!
"కందుకూరి" గొప్ప కర్మవీరుండోయ్!
వీరేశలింగ మొక విప్లవతరంగమోయ్!

ఆంధ్రజాతికి మేలుకొలుపు పాడా డతడు
ఆంధ్రగౌరవగీతి ఆలపించా డతడు
అంధవిశ్వాస గాఢాంధకారము బాపి
అభ్యుదయగతుల ముందడుగు వేయించాడు !!

తెలుగుగడ్డకు మంచి పేరు తెచ్చా డతడు
తెలుగుబిడ్డకు ముందు చూపు నిచ్చా డతడు
తెలుగు గుండెకు క్రొత్త వెలుగు పోశా డతడు
కులమతద్వేషాలు కూల్చివేశా డతడు !!

నవ్యాంధ్రసాహితికి నాందిగీత మ్మతడు
ప్రాచీనసాహితికి భరతవాక్య మ్మతడు
దేశమంతటికి సందేశమైనా డతడు
లోకాని కొక నవాలోక మైనా డతడు!!

సంఘసంస్కార దీక్షాబద్ధకంకణుండు
సాహిత్య నవయుగాస్థాన సంస్థాపనుండు
మహిళా మహాభ్యుదయ మహనీయజీవనుండు

అమరజీవికి పూజ లర్పించుకుందాము
రం...డోయ్! రండో...య్! రం...డో...య్!!

# యశోధర

కన్నీళ్ళతో ప్రభువు కదలిపోతున్నాడు
ఎన్నాళ్ళకో మాకు యిక పునర్దర్శనము
శోకమా కన్నెత్తి చూచుకోవమ్మా !
కోకిలా గొంతెత్తి కూయబోకమ్మా !

పరమ సుకుమారములు ప్రాణేశు పాదాలు
హెచ్చుతగ్గుల దారి గుచ్చుకుంటుందేమొ
మెల్లంగ రావయ్య మేఘుడన్నయ్యా !
చల్లంగ ముత్యాలు చల్లిపోవయ్యా !

కనుగందునో స్వామి కుసుమకోమలమూర్తి
పసివాడునో స్వామి మసృణమంజులమూర్తి
కాకచూపింపకో లోకబాంధవుడా !
కనిపెట్టియుందుమో కమలబాంధవుడా !

# నాన్న కోసం

[అర్ధరాత్రి అంధకారంలో శ్రీమతినీ, చిరంజీవినీ విడిచి శోకమయమైన లోకాన్ని సముద్ధరించటం కోసం కరుణామూర్తి గౌతముడు కదలిపోతాడు. క్రమంగా కొన్నాళ్లకు గౌతముని కుమారుడు రాహులుడు పెరిగి పెద్దవాడవుతాడు. "నాన్న యేడి ? ఎక్కడికి వెళ్లా ?" దని వాళ్లమ్మని వేధించటం మొదలు పెడుతాడు. కన్నతల్లి యశోధరాదేవి ఎన్నో విధాల కొడుకును మాయమాటలు చెప్పి మరపింప చూస్తుంది. అందరబ్బాయిల నాన్నల్ని చూచి కుమార రాహులిడిహృదయంకూడా తండ్రిదర్శనం కోసము తహతహ లాడుతుంది. ఆ పసికంఠం లోనుంచి ప్రసరించిన భావకిరణాలేయివి.]

నాన్నయేడే అమ్మ !
నాన్న యేడే ?

ఎక్కడికి పాయినాడె
ఎన్నాళ్లకొస్తాడె
వస్తు వస్తూ ఏమి
వస్తువులు తెస్తాడె !

రేపు వస్తా డంటు
మాపు వస్తాడంటు
చూచిచూచీ కళ్లు
వాచిపోతున్నాయి

గోలచేస్తాననీ
కోప మొచ్చిందిటే!
అల్లరబ్బాయినని
అలిగిపోయినాడుటే
నాన్నయేడే అమ్మ!
నాన్నయేడే?

అదుగదుగో మబ్బుల్లో
అందాల జాబిల్లి!!
పంచకల్యాణిపై
బాబయ్యొ రాడేమె?
ఆ కొండ మీదుగా
ఆ మబ్బులోనుంచి
నాన్న మన యింట్లోకి
నడచి వస్తాడుటే
నాన్నయేడే అమ్మ!
నాన్నయేడే?

నిన్న నీ వొళ్లోను
నిదురపోతుంటేను
నాన్న కల్లో కొచ్చి
నన్నెత్తుకున్నాడె
చల్లగా మెల్లగా
వొళ్లంత నిమిరాడె
మానాన్నచేతుల్లొ
మైమరచి పోయినానె
నాన్నయేడే అమ్మ !
నాన్నయేడే ?

నాన్న చల్లని చెయ్యి
నాన్న తియ్యనిముద్దు
మరచిపోదామన్న
మరపురాకున్నాయె !
తనవెంట ననుగూడ
గొనిపోదునన్నాడె
కన్ను లెత్తే సరికి
కనుపించనే లేదె
నాన్నయేడే అమ్మ !
నాన్నయేడే ?

నీ కళ్లలో యిన్ని
నీటి ముత్యా లేమె!
గుండె టకటక యిట్లు
కొట్టుకుంటుందేమె !
ఎక్కెక్కి యేడుస్తు
యేమి లే దంటావు
చేతు లివి చూడవే
చిక్కిపోయినా యెంతో
నాన్నయేడే అమ్మ !
నాన్నయేడే ?

రేపులెన్నో పోయె
బాపుజీ రాడాయె
మాయమాటలు చెప్పి
మరపించుతున్నావు
నన్నయిన పంపవే
నాన్న దగ్గర కెళ్లి
అమ్మ యేడుస్తున్న
దని పిల్చుకొస్తాను
నాన్నయేడే అమ్మ !
నాన్నయేడే !

అందరబ్బాయిలతో
ఆడుకోబోతేను
జనమంత నావైపు
జాలిగా చూస్తారె
నాన్నతే కేడ్చేటి
నాలాంటి పసివాళ్ల
కన్నీళ్లు తుడిచి, ఓ
దార్చి వస్తాడుటే
నాన్నయేడే అమ్మ
నాన్నయేడే ?

ఎక్కడికి పోయినాడె
ఎన్నాళ్ల కొస్తాడె
వస్తువస్తూ ఏమి
వస్తువులు తెస్తాడె ?

# నిద్దురలేవోయ్

కొంపలు గోడలు గుల్లలుచేస్తూ
తల విరబోసుక తైతకలాడే
మద్యపానమను మహారాక్షసిని
నీ పలుగులతో పొడిచెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

రైతుల పైబడి రక్తము త్రాగే
బీదల కండలు కరకర నమిలే
వడ్డీ దయ్యపు కాళ్లుచేతులను
నీ గొడ్డలితో నరికెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

ధనికతత్వమూ స్వార్థపరత్వము
బిగుసుకుపోయిన బీటిపొలాలను
పొదుకుపోయిన పాటిదిబ్బలను
నీ నాగలితో దున్నెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

కార్మికవర్గము కండలుకొరికే
కర్మాగారపు కఠినచట్టములు
యంత్రాలయముల హైన్యపద్ధతులు
నీ గుంటకతో సరిచెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

జాతివైరములు చదునై పోయిన
జాతీయత వ్యవసాయము చేసిన
జన్మభూమిలో శాంతీ బీజములు
నీ జడ్డిగమున వెదబెట్టాలోయ్
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

పైరుపొలాల్లో పడి తెగతెంటూ
రంకెలుబెట్టే ఆబోతెద్దుల
గంతులువేసే గంగిరెద్దులా
నీ ములుగర్రతో అదిలించాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

అల్లిబిల్లిగా అల్లుకుపొయ్యే
మూఢాచారపు ముళ్లతీగలను
మతవిద్వేషము కలుపు మొక్కలను
నీ కొడవలితో కోసెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

పంటచేలపై పచారుచేస్తూ
పైపై తిరిగే పరిగ పిట్టలను
కంకులుకొరికే కాకిమూకలను
నీ వడిసెలతో బెదరించాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

కుప్పలు బడ్డా కులభేదాన్ని
కళ్లాన్నేసీ నురిపిడిచేసీ
భరతభూమిపై పాటలుపాడుతు
నీ చేటలతో తూర్పెత్తాలోయ్—
నిద్దురలేవోయ్ !! కర్షకుడా !!

అగ్రజాతులా ఆత్మలలోపల
అంటుకుపోయిన అస్పృశ్యతనీ
అతుక్కుపోయిన అంధత్వాన్నీ
నీ పాలికట్టుతో తుడిచెయ్యాలోయ్—
నిద్దురలేవోయ్!! కర్షకుడా!!

తాలూతరకా గాలికిపోసీ
దయాకాంతులను ధాన్యపురాసులు
బండ్లకునెత్తీ పాతరవేసీ
నీ గాదెల్లో నింపించాలోయ్—
నిద్దురలేవోయ్!! కర్షకుడా!!

# జ్యోతి

వెలిగింపరా !! జ్యోతి
వెలిగింపరా !!

విజయ భారతజాతి
విశ్వ మంగళ గీతి
వినవచ్చుచుండెరా !
విద్యార్థి సోదరా !

వెలిగింపరా !! జ్యోతి
వెలిగింపరా !!

పారతంత్ర్య మహాంధ
కార కారాగార
ద్వారాలు బ్రద్దలై
వీర విస్ఫూర్తితో

నవ్యభారత భాగ్య
దివ్య ఘంటాధ్వనులు
దిగ్ దిగంతాల ప్ర
తి ధ్వనించుచునుండె

వెలిగింపరా !! జ్యోతి
వెలిగింపరా !!

అభ్రంకష మహా హి
మాల యోత్తుంగ శృం
గాగ్ర గంగా తరం
గ ప్రవాహమ్ములో
కాల మేఘాభీల
ఘట పటాపంచలై
స్వాతంత్ర్య చంద్రికలు
జాలు వారేటట్లు

వెలిగింపరా !! జ్యోతి
వెలిగింపరా !!

అరిభయంకర జయం
కర పవిత్రక్షాత్ర
వీరవిస్ఫార భా
రత కురుక్షేత్రాన
కలుష కౌరవచమూ
కర్ణ భేదమ్ముగా
విజయ గాండీవరా
వము విజృంభించినది

వెలిగింపరా !! జ్యోతి
వెలిగింపరా !!

విజయభారత జాతి
విశ్వ మంగళగీతి
వినిపించు చుండెరా !
విద్యార్థి సోదరా !!
వెలిగింపరా !! వెలిగింపరా !!

# పండుగరోజు

కుచ్చితంపూ దొరల కుటిల కృత్యాలలో
బిచ్చగత్తెగనైన పిచ్చి "భారతమాత"
పచ్చన్ని చేలతో పసిడి కుచ్చెళ్లతో
పచ్చపచ్చగ "పచ్చిబాలెంత" యగురోజు
వచ్చిందిరా!! బాబు వచ్చిందిరా!!

ఇల్లుదోపిడిగాళ్లు కల్లుదోపిడిగాళ్లు
మిల్లు దోపిడిగాళ్లు వొళ్లుదోపిడిగాళ్లు
తెల్లమోములువేసి దేబెచూపులతోడ
తోకల్లు జాడించి తొలగిపోయేరోజు
వచ్చిందిరా!! బాబు వచ్చిందిరా!!

అన్నదమ్ముల మంచు అన్నిజాతులవారు
పిన్నితమ్ముళ్లతో చిన్నచెల్లెళ్లతో
కన్న చల్లనితల్లి పున్నెంపు పాదాలు
పొన్నపూలూ తెచ్చి పూజచేసేరోజు
వచ్చిందిరా!! బాబు వచ్చిందిరా!!

# తప్పిపోని తమ్ముడు

[ఆయమ్మకు ఐదుగురు సంతానం. పెద్దవాళ్లు నలుగురూ చిచింద్రీలు. ఆయిదోవాడు అమాయకుడు. అన్నలంతా ఒకటై తమ్ముణ్ణి విడదొక్కారు దూరంగా వుండమన్నారు. ముట్టుకుంటే తంతామన్నారు. పాపమా పసిబిడ్డ తల్లిని కౌగిలించుకొని బావురుమన్నాడు. చిక్కి శల్యమైవున్న చిన్న కొడుకును చూడంగానే కడుపు తరుక్కుపోయింది. వొళ్లోకి తీసికొని బుజ్జగించింది. కొడుకుల్ని కూకలేద్దామనుకుంది. అంతలోకే వచ్చారు అసహాయ శూరులు పెద్దబ్బాయిలు. విషాద వీణ మోగింది కన్నతల్లి కంఠంలో]

అందకుండా మీరు
ముందు పరుగేస్తుంటె
విడలేక తమ్ముడూ
వెనకాలె వస్తుంటె
ధుమ ధుమలాడారుటే!! బిడ్డపయి
దుమ్మెత్తి పోశారుటే!!

వడగాడ్పులో శోష
వచ్చి నాలుక యెండి
చెర్లోని దేవుడిచ్చిన
నీళ్లు త్రాగబోన్
కళ్లెర్ర చేశారులే! తండ్రిపై
రాళ్లన్ని రువ్వారులే!!

ధ్వజస్తంభము కాడ
దణ్ణాలు పెడుతుంటె
మడిగట్టి కూర్చున్న
గుడిలోని జేజాయి
మైలబడు నన్నారులే!! నాయన్ని
మాలవాడన్నారులే!!

అన్నలంతాగూడి
నన్ను కేటాజేసి
శివుడు గుళ్లోకెళ్ళి
చిందులేశారంటు
వెక్కి వెక్కేడ్చాడురా!! నాతండ్రి
చిక్కి సగమైనాడురా!!

జట్టులో రానీక
నెట్టివేశారంటు
మరగిపోయెను మనసు
తిరిగి పోయెను బుద్ధి
కరగి పోతున్నాడురా !! నాతండ్రి
తరిగి పోతున్నాడురా !!

కడగొట్టు తమ్ముడని
గారాబు తమ్ముడని
కనికారమేలేని
కటికి రక్కసులార
ఏతప్పు చేశాడురా !! మీసొమ్ము
ఏమి కాజేశాడురా !!

# బీదా సాదా

ఉందామంటే కొంపాలేకా
తిందామంటే తిండీలేకా
కొందామంటే పైసాలేకా
కూరుచున్నామోయ్ తండ్రీ!
కుములు చున్నామోయ్!

రెక్కలన్నీ విరుచుకొని
రక్తమంతా ధారపోస్తే
రాకాసి లోకమ్మూ మమ్మూ
కూకలేస్తుందోయ్ తండ్రీ!
కేకలేస్తుందోయ్!

ఎండిపోయెను కండలన్నీ
యింకి పోయెను నెత్తురంతా
క్షామదేవత మా గుడిసెల్లో
కాలుపెట్టిందోయ్ తండ్రీ!
గజ్జె గట్టిందోయ్!

# స్వేచ్ఛా దీపాలు

దీపావళి దీపావళి
దివ్యోజ్జ్వల దీపావళి

అస్వతంత్ర భారతీయ
దాస్య తమస్సమూహములు
శాశ్వతముగ పోకార్చె
విశ్వశాంతి చేకూర్చె
దీపావళి దీపావళి
దివ్యోజ్జ్వల దీపావళి

స్వార్థపరుల గుండెలపై
పెట్లదిమ్మ ఫెళఫెళలూ
దేశద్రోహుల మొగముల
తెల్లమతాబా కళలూ

దోశీనగాడి కొడుకు చేతి
తోటాలో నిప్పురవ్వ
కూటికేడ్చు బీదవారి
గుడిసెలు కాల్చేసింది

సీమబొగ్గు చిటచిటలూ
టపాకాయ పటపటలూ
చిచింద్రీలు చిచ్చుబుడ్లు
దివ్వెటీలు పువ్వొత్తులు
రువ్వలు తారాచువ్వలు

దహనం లంకాదహనం
పరప్రజల బాధించే
నరకాసుర సామ్రాజ్యం
హరోం హరోం హరోం హరోం

శీతాచల శిఖరాగ్రం
స్వాతంత్ర్య జ్యోతులతో
నిగనిగలాడిం దదుగో
ధగధగ మెరిసిందదుగో

వెలిగింపవె వెలిగింపవె
వీరబాల! దీపమాల
యుగయుగాల చైతన్యం
జగజగాల వెలిగింపవె
నవయువకుల హృదయంలో
వేడివేడి చమురు పోసి
వెలిగింపవె వెలిగింపవె
వీరబాల! దీపమాల!

అస్మదీయ పూర్వపురుష
ప్రస్ఫుర దాత్మజ్యోతులె
దీపికలై నవ్యయుగో
దీపికలై దిగివచ్చెను

అదుగదుగో అరుణకాంతి
అదుగదుగో స్వర్ణకాంతి
దేశమాత గుమ్మంలో
దివ్యోజ్జ్వల దీపకాంతి

తియ్య తియ్య నవ్వులతో
తేట తెలుగు పువ్వులతో
లేత లేత చేతులతో
స్వాతంత్ర్యపు గీతులతో
గుమ్మటాలు తిప్పుకుంటు
గుమ్మంలో కుర్చున్నావ్
ఎవరమ్మా? అమ్మాయీ!
అమ్మాయీ! ఎవరమ్మా?

# ఓ ప్రభూ

ఉదయాద్రి కాలూను
కొదమ భానుని చూచి
చరమాద్రి కాల్జారు
చందమామను చూచి
ఉప్పొంగి బిట్టార్తువా?
ఉస్సురని నిట్టూర్తువా?

పట్నమేలే రాజు
పసిడి పళ్లెములోన
కట్టెలమ్మే వాని
మట్టికంచములోన
పన్నీరు చిలికింతువా?
కన్నీరు వొలికింతువా?

పసమించు పురిటింటి
పసిపాప దెసగాంచి
పసిచెడ్డ పెరటింటి
ముసలమ్మ దశ గాంచి
పొంగి పోవుచు నుందువా?
క్రుంగి పోవుచు నుందువా?

చిన్నారి పొన్నారి
చిగురు టాకుల వైపు
పండిరాలుచు నున్న
పండు టాకుల వైపు
సంతోషముగ చూతువా?
సంతాప మెగబోతువా?

పార్కులో విహరించు
బాబుగారిని చూచి
జైలులో కృశియించు
దేశభక్తుని చూచి
కులికి పోవుచునుందువా?
కుమిలిపోవుచు నుందువా?

ఫెళఫెళా మ్రోగేటి
పెండ్లి బాజాలలో
దేవుడో యని యేడ్చు
చావు కంఠాలలో
తలంబ్రాలు పోయింతువా?
తలకొరివి పెట్టింతువా?

బానిసలుగా ప్రజలు
పాలించు భూభుజుల
పరతంత్రులై భంగ
పడిన దేశప్రజల
అందలము లెక్కింతువా?
క్రిందనే త్రొక్కింతువా?

## బుల్లిమరదలు

నిద్రమంచంనుంచి లేవోయీ!
ప్రొద్దు పొడిచిందదుగో బావోయీ!
జాతీయ సౌరభ్య సరస ప్రచారముం
స్వాతంత్ర్యవాయువులు సాగినవి మెల్లగా

ప్రవిమిలోదయ భాగ్య
నవనవారుణరేఖ
ప్రాచీ దిశాంగనా
ఫాలమ్మున మెరిసింది

నిద్రమంచంనుంచి లేవోయీ!
ప్రొద్దు పొడిచిం దదుగో బావోయీ!

కటికి చీకటి తెరలు గడచిద్విజబృందములు
కలకల ధ్వనులతో గగనాని కెగసినై

నిరుపేద కర్షకుడు
అరక కోటేరేసి
బువ్వమూ ఎత్తుకొని
పొలము పోతున్నాడు

నిద్రమంచంనుంచి లేవోయీ!
ప్రొద్దు పొడిచిం దదుగొ బావోయీ!

చంటిపిల్లావాణ్ణి చంకన్న వేసుకొని
బీదబాలిం తొకతె బిచ్చాని కొచ్చింది

మొలగుడ్డ నసిలేని
ముసలి తాత యొక్కడు
వాకిట్లొ కూర్చోని
కేకలేస్తున్నాడు

నిద్రమంచంనుంచి లేవోయీ!
ప్రొద్దుపొడిచిం దదుగో బావోయీ!

# దివ్య దీపావళి

వెలగవే వెలగవే
విశ్వాంగణమ్ములో
దివ్య దీపావళీ!
నవ్యశోభావళీ!!

వెలగవే వెలగవే
వీర భారత భూమి
దిగ్ దిగంతము లెల్ల
దేదీప్యమానముగ
విజయ విప్లవ కర్మవీర వక్షోరక్త
సంసిక్తముక్తావళీ
కాలభైరవ మహాభీల ఫాలేక్షణ
ప్రజ్వలత్ జ్వాలావళీ

దివ్య దీపావళీ
నవ్య శోభావళీ

# బాకా

మేమంతా తెలుగు పటాలం
ఏమైనా సహింపజాలం
స్వార్థానికి స్వాగతమిచ్చి
సాంబారుకు సలాముచేస్తాం

ఆంధ్రంలో ఆలోచిస్తాం
అరవంలో ఫెయిర్లు వ్రాస్తాం
హిందీలో ప్రూఫులు దిద్దీ
ఇంగ్లీష్‌లో అచ్చేయిస్తాం

మంత్రులమై బైఠాయిస్తాం
మదరాసుకు నీళ్ళువదుల్తాం
మనరాష్ట్రం సమస్య వస్తే
ఘనకెందుకులే పొమ్మంటాం

బస్సుల్లో పచార్లుచేస్తాం
యస్సంటే యస్సేనంటాం
విస్సన్నలు విమర్శచేస్తే
ముస్సోలిని ముఖాలు పెడతాం

స్వర్గానికి నిచ్చెన వేస్తాం
స్వాతంత్ర్యం మోసుకువస్తాం
అయ్యల హస్తాల్లో పెట్టి
అఘోరిస్తు యింటికి వస్తాం

తెలుగంటే మూతిపిరుస్తాం
వెలుగంటే కన్నులు మూస్తాం
కలుగుల్లో ఎలుకల్లాగా
స్వార్థానికి గోతులు తీస్తాం

కాలానికి తాళంవేస్తాం
మేళానికి హంగులుచేస్తాం
ఎవరన్నా యిదేమిటంటే
మీకెందుకు పొమ్మంటాం

గ్రూపుల్లో షాపులు పెడతాం
షాపుల్లో కాపులు వేస్తాం
కాపుల్లో చూపులు చూసీ
పాపాలకు పర్మిటిస్తాం

అయోమయం మా శుద్ధాంతం
అంధత్వం మా సిద్ధాంతం
మేమంతా తెలుగుపటాలం
ఏమైనా సహింపజాలం

•

# ఉ ద య గీ తి

ఎవరు నను మేల్కొల్పి
రీ నవోషస్సులో
ఈ నవోషస్సులో – నీరవ సరస్సులో –

ఎచటి వీ రమణీయ
రాగారుణాంగుళులు
ఎచటి వీ కమనీయ
కంకణక్వణనములు
ఈ నవోషస్సులో – జీవిత తమస్సులో –

ఎంత చల్లని పాణి
ఎంత చక్కని వాణి
పులకించి బ్రతుకంత
పొంగులెత్తేని
ఈ నవోషస్సులో – మంజుల మహస్సులో.
ఎవరు నను......

# చల్ చల్‌రే నౌజవాన్!

ఊదరా! ఊదరా! ఊదరా! సోదరా!
ఉడుకు రక్తపు పొంగు లుప్పొంగ జయశంఖ
మూదరా!! ఊదరా!!

ఉరకరా! ఉరకరా! ఉరకరా! సోదరా!
విధురప్రజారుధిర మధురసోన్మదులపై
ఉరకరా!! ఉరకరా!!

నిలుపరా! నిలుపరా! నిలుపరా! సోదరా!
జ్యోతిః ప్రపూత జాతీయ విజయధ్వజము
నిలుపరా!! నిలుపరా!!

# వ్య త్యా సా లు

మా కండలు పిండిన "నెత్తురు"
మీ పెండ్లికి చిలికిన "అత్తరు"
మా మొగాల కీ "కన్నీరూ"
మీ మొగాల కా "పన్నీరూ"

మా నోట్లో అకటి "భగభగ"
మీ నోట్లో సిజర్సు "భుగభుగ"
మా కీ పడిపోయిన గోడలు
మీ కేడంతస్తుల మేడలు

చింపిగుడ్డ సింగారం మాకూ
వొళ్ళంతా బంగారం మీకూ
మేము మండుటెండల్లో మాడుతు
మీరు పండువెన్నెల్లో ఆడుతు

మీ కార్లకు పనికిరాని టైర్లు
మా కాళ్ళను కాపాడే జోళ్లు
మా బ్రతుకిది మళ్ళీమళ్ళీ
మీ బుగ్గన తిరిగే కిళ్ళీ

బాబుగారి పాకీదొడ్లో
పట్టపగలు ఎలక్ట్రిసిటీ
పాకీవాడి పూరిపాకాలో
కార్మబ్బులు కటికచీకటి

మా లోపల అగ్నిజ్వాలలు
మీ లోపల అజీర్ణశూలలు
మీ మోటార్ లేపిన ధూళి
మా నుదుటికి గులాబి పౌడర్

వస్తున్నా మే మిక్కడ
మేస్తున్నారా మీ రక్కడ
ఎందాకా తమకీ డాబులు
క్రిందికి దిగుతారా బాబులు !!

# తరంగాలు

తరంగాలు తరంగాలు
స్వర్గంగా తరంగాలు
ప్రపంచాలు ముంచెత్తే
ప్రజాశక్తి తరంగాలు
పొంగి పొంగి వస్తున్నై
పొరలి పొరలి వస్తున్నై.

విలయ సంధ్యాతాండవ వేదికపై
ప్రళయకాల మహానటుడు
ఘల్ ఘల్ ఘల్ ఘల్లని చరణం
కదలించా డల్లదుగో!
విశాల విప్లవ జటాజూటం
విదలించా డల్లదుగో!

జ్యోతిర్మయ స్వాతంత్ర్యోజ్జ్వల
శీతాచల శిఖరాంచలముల
జాతీయస్రోతో వాహిని
హ్రోతలతో దిగివస్తున్నది
అఖండ భరతఖండమంతా
ఆప్లావిత మొనరిస్తున్నది

అదుగదుగో మహాప్రవాహం
అల్లదుగో మహాప్రవాహం
అదురులేని బెదురులేని
యెదురులేని ప్రజాప్రవాహం
పొంగి పొంగి వస్తున్నది
పొరలి పొరలి వస్తున్నది
రండి రండి తల్లుల్లారా!
రండి రండి బాబుల్లారా!!

మనమంతా జలకణాలమై
ప్రవహిద్దా మీ ప్రవాహంలో
కర్మవీర రక్తకణాలై
కార్మికజన ఘర్మకణాలై
కర్షకగణ బాష్పకణాలై
ప్రవాహంలో ప్రవేశించి
ప్రవహిద్దాం మనమంతా

జన్మభూమి అడుగులపై
ప్రవహిద్దాం మనమంతా
సువర్ణమాలా సమలంకృత
త్రివర్ణ మహాధ్వజాగ్రంలో
నవజ్యోతి సందర్శించే
నవస్ఫూర్తి సంపాదించే
యువభారత తరంగాలు
నవజీవన తరంగాలు

భుగభుగరాజే గుండెల్లో
భగభగమండే మంటల్తో
యుగయుగాల చైతన్యం
జగజగాల వెలిగించే
తరుణ తరుణ తరంగాలు
అరుణారుణ తరంగాలు

ప్రపంచాలు ముంచెత్తే
ప్రజాశక్తి తరంగాలు

పొంగి పొంగి వస్తున్నై
పొరలి పొరలి వస్తున్నై

వొత్తండయ్యా! జయశంఖం;
ఎత్తండమ్మా! జయహారతి—

# కావాలి

బీదసాదల నిరుపేద జీవనము
కార్మిక సంఘాల కష్టజీవనము
కర్షక సంతతి కరుణజీవనము
బానిసజాతి నిర్భాగ్యజీవనము
తమచేతి కలములో తనరారునట్లు
తమచేతి కుంచెలో తళుకొత్తునట్లు
ఉడుకునెత్తురు మేన నుప్పొంగునట్లు
కటికగుండెలనైన కరగించునట్లు
రచియించు కవికుమారకులు కావాలి
రంజించు చిత్రకారకులు కావాలి
భావిభారతదేశ భాగ్యమ్ముకొరకు
కావాలి కావాలి కావాలి నేడు

# వందేమాతరం

[ఇంఫాల్ రణరంగంలో మాతృదేశ స్వాతంత్ర్యంకోసం ఆత్మార్పణంచేసి క్షతగాత్రుడై కొనప్రాణాలతో కొట్టుకొంటూన్న అజాద్ హింద్ ఫౌజు సైనికుడి అంతిమ హృదయ స్పందనం.]

అజాద్‌హింద్ విజేతలం
ప్రజారాజ్య విధాతలం

నేతాజీ మాదైవం
స్వాతంత్ర్యం మాజీవం

అమ్మా ! భారతమాతా
అహింఫౌజు సైనికుణ్ణి
దేశద్రోహినిగా సం
దేహిస్తావా తల్లీ !!
జపాన్‌వాడి బానిసగా
శంకిస్తావా తల్లీ !!

ఇంతలోతు కష్టంలో
యీది యీది నీకోసం
నడిచామే మేమంతా
పిడిచామే బ్రతుకంతా
విడిచామే సుఖశాంతులు

చిట్టిగాంగు నట్టడవులు
చుట్టిచుట్టి పట్టుపట్టి
ఎండల్లో కొండల్లో
తిండిలేక నిద్రలేక
తిరిగి తిరిగి సురిగి సురిగి
రాళ్ళల్లో ముళ్ళల్లో
రాత్రి పగలు నీకోసం
రక్తం చిందించామే

నా కండల్లో వీర్యం
నా గుండెల్లో ధైర్యం

నీకోసం వ్యయంచేసి
నీ కొరకే సమర్పించి
అజాద్‌హింద్ యజ్ఞంలో
ఆహుతియైనావమ్మా !

సర్వస్వం నీకోసం
స్వాహా చేశానమ్మా !

అంత్యనమస్కారమైన
ఆచరింపలేనమ్మా !

అంతిమ ప్రార్థనకైనా
గొంతు విప్పలేనమ్మా !

పడిపోయిన నాదేహం
తెగిపోయిన నాచేతులు
బ్రద్దలయిన నావక్షం
ప్రవహించే నా రక్తం

వ్రేలాడే నా ప్రేగులు
కొట్టుకునే నా గుండెలు
చుట్టుకునే రాబందులు
సాక్ష్యం నా త్యాగానికి

చెవుల్లో మ్రోగుతూంది
'జైహింద్' నినాదం
కళ్ళల్లో మెరుస్తూంది
కన్నతల్లి ప్రాసాదం

నా స్వతంత్ర జయభారతి
నవ్యభవ్య దివ్యాకృతి
స్వప్నంవలె స్వర్గంవలె
కనురెప్పల సందుల్లో
కదలని ఒక బాష్పకణం

నేతాజీ నాదైవం
స్వాతంత్ర్యం నాజీవం

అల్లమగో లాల్ ఖిల్లా
ఢిల్లీలో పిలుస్తూంది
వస్తున్నా వస్తున్నా
పరుగెత్తుకు వస్తున్నా
జైహింద్ ఢిల్లీచలో !

నీకోసం వ్యయంచేసి
నీ కొరకే సమర్పించి
అజాద్‌హింద్ యజ్ఞంలో
అహుతినైనావమ్మా !

సర్వస్వం నీకోసం
స్వాహా చేశానమ్మా !

అంత్యనమస్కారమైన
ఆచరింపలేనమ్మా !

అంతిమ ప్రార్థనకైనా
గొంతు విప్పలేనమ్మా !

పడిపోయిన నాదేహం
తెగిపోయిన నాచేతులు
బ్రద్దలయిన నావక్షం
ప్రవహించే నా రక్తం

వ్రేలాడే నా ప్రేగులు
కొట్టుకునే నా గుండెలు
చుట్టుకునే రాబందులు
సాక్ష్యం నా త్యాగానికి

చెవులల్లో మ్రోగుతూంది
'జైహింద్' నినాదం
కళ్ళల్లో మెరుస్తూంది
కన్నతల్లి ప్రాసాదం

నా స్వతంత్ర జయభారతి
నవ్యభవ్య దివ్యాకృతి
స్వప్నంవలె స్వర్గంవలె
కనురెప్పల సందుల్లో
కదలని ఒక బాష్పకణం

నేతాజీ నాదైవం
స్వాతంత్ర్యం నాజీవం

అల్లదుగో లాల్ ఖిల్లా
ఢిల్లీలో పిలుస్తూంది
వస్తున్నా వస్తున్నా
పరుగెత్తుకు వస్తున్నా
జైహింద్ ఢిల్లీచలో!